రవీంద్ర సాహిత్యం -



# దేవకన్య



మూలం :

రవీంద్రనాథ టాగూర్

అనువాదం :

కె. రమేష్

బాలాజీ పబ్లికేషన్సు
విజయవాడ_2.

# దేవకన్య

రాజకుమారుని వయస్సు ఇరవై దాటింది. రాకుమారుని వివాహాన్ని గురించి వివిధ దేశాలనుంచి రాయబారాలు వస్తున్నాయి.

"బాహ్లీక కుమార్తె నిస్సందేహంగా సౌందర్యవతి. తెల్ల గులాబీల పుష్పవృష్టివలె వుంటుంది" అన్నాడు కటక్.

రాకుమారుడు అయిష్టంగా అటుతిరిగి ఏమీ జవాబు చెప్పడు.

గాంధార రాజ్యంనుంచి వచ్చిన దూత "గాంధార రాకుమార్తె అందం యింతింతని వర్ణింపనలవికాదు. ప్రతి అవయవమూ సౌందర్య భరితము - ద్రాక్షలతను వ్రేలాడు పళ్ళ గుత్తులవలె చాలా అందంగా వుంటుంది" అని చెప్పాడు.

రాకుమారుడు వేటమిషతో అడవికి బయలుదేరి వెళ్ళాడు. రోజులు గడిచాయి, వారాలు గడిచాయి, రాజకుమారుడు తిరిగి రాలేదు.

దూతవచ్చి "నేను కాంభోజ రాకుమార్తెను చూసి వచ్చాను. ఆమె వాలుకన్నుల రెప్పలు ప్రాతఃకాలపు దిఙ్మండల సోయగాన్ని మరిపిస్తాయి, శిశిరముకంటె స్నిగ్ధములై వింతకాంతితో మెరుస్తూ వుంటాయి" అని చెప్పాడు.

రాకుమారుడు భర్తృహరి కావ్యాన్ని చదవసాగాడు, పుస్తకంలోంచి కన్నెత్తి చూడలేదు.

"రాకుమారుడు ఇలా మౌనం వహించటానికి కారణం ఏమిటి? వెంటనే మంత్రికుమారుని పిలిపించండి" అన్నాడు మహారాజుగారు.

మంత్రికుమారుడు వచ్చాడు.

"నువ్వుకూడా మా కుమారునితో సమానమైన వాడవు. రా కుమారుని మిత్రుడవు. వివాహమంటే అతనికి యెందుకు ఇష్టంలేదో నిజంచెప్పు" అని అడిగాడు మహారాజు.

"మహారాజా, ఒకనాడు రాజకుమారుడు దైవలోకాన్ని గురించిన కథవిన్నాడు. ఆనాటినుంచీ తాను దైవకన్యనే వివాహమాడాలని సంకల్పించుకున్నాడు" అని చెప్పాడు మంత్రి కుమారుడు.

* * *

"దైవలోకం ఎక్కడుందో జాడ తెలుసుకోవలసిందిగా మహారాజుగారు ఆదేశించారు.

గొప్పగొప్ప పండితులు వచ్చారు. ఎక్కడెక్కడి గ్రంథాలన్నీ తెప్పించి పరిశోధించారు.

"ఎక్కడా యే గ్రంథంలోనూ అప్సరసల లోకాన్ని గురించి ఒక్కమాటకూడా కన్పించలేదు" అని చెప్పారు పండితులు.

అప్పుడు మహారాజు గొప్పగొప్ప వ్యాపారుల్ని పిలిపించి అప్సరసల లోకాన్ని గురించి అడిగాడు. "మహారాజా, సముద్రాలు దాటి మేము అనేక దీవులు తిరిగివచ్చాము. ఎలా

ద్వీపం, మరీచద్వీపం వెళ్ళాము. లవంగంతి రాజ్యానికి వెళ్ళాము. మంచిగంధపు చెక్కలకోసం మలయద్వీపానికి వెళ్ళాము. కస్తూరికోసం కైలాసమందున్న దేవదారు అరణ్యానికి వెళ్ళాము; కానీ మాకు యెక్కడా అప్సరసల దేశం జాడమాత్రం తెలియలేదు" అని చెప్పారు వ్యాపారులు.

మళ్ళీ మహారాజుగారు మంత్రికుమారుని పిలిపించారు, "అప్సరస లోకాన్ని గురించి రాకుమారుడు యెవరిద్వారా విన్నాడు" అని అడిగాడు.

"మహారాజా, రాకుమారుడు అడవికి వేటకు వెళ్ళినప్పుడు విన్నాడు. మురళి వాయిస్తూ అడవుల్లో తిరిగే కొత్త పిచ్చివాడు రాకుమారుడికి అప్సరసకథ చెప్పాడు" అని చెప్పాడు మంత్రికుమారుడు.

"అతనిని పిలిపించండి" అని ఆజ్ఞాపించారు మహారాజుగారు.

కొత్తపిచ్చివాడు దోసిలితో అడవిపూలు తెచ్చి మహారాజుగారికి సమర్పించి యెదురుగా నిలబడ్డాడు. "అప్సరసలను గురించి నువ్వెక్కడ విన్నావు?" అని మహారాజుగారు ప్రశ్నించారు.

"మహారాజా, నే నెప్పుడూ అక్కడికి వెళ్ళి వస్తూఉంటాను" అని చెప్పాడు పిచ్చివాడు.

"ఆ ప్రదేశం ఎక్కడుంది?" అని మహారాజుగారు తిరిగి ప్రశ్నించారు.

"మీ రాజ్యపు సరిహద్దున చిత్రగిరి పర్వత లోయలో

కామ్యక్ సరోవర తీరాన వుంది ఆ ప్రదేశం” అని చెప్పాడు పిచ్చివాడు:

“అక్కడ అప్సరసలు కన్పిస్తారా?” అని ప్రశ్నించారు మహారాజుగారు.

“కన్పిస్తారు. కానీ గుర్తించలేము మారు వేషంలో విహరిస్తూ వుంటారు. అప్పుడప్పుడూ వెళ్ళిపోయేముందు తామెవరో చెప్పి వెళతారు కానీ అప్పుడు వారిని పట్టుకునే అవకాశం వుండదు” అని చెప్పాడు పిచ్చివాడు.

“నువ్వు వారిని ఎలా గుర్తించగలుగుతున్నావు?” అని అడిగారు మహారాజుగారు.

“ఒక్కొక్కప్పుడు గానంద్వారా గుర్తిస్తాను, మరొకప్పుడు వింతవెలుగును చూసి గుర్తిస్తాను” అని చెప్పాడు పిచ్చివాడు.

రాజుగారు విసుగుచెంది “అతడు చెప్పినదంతా ఆసాంతం పిచ్చివాగుడు. వెంటనే ఇతనిని బయటకు గెంటివేయండి” అని ఆజ్ఞాపించారు.

  

పిచ్చివానిమాటలు రాకుమారుని మనస్సులో నాటుకుపోయాయి.

ఫాల్గుణమాసం టేకుచెట్లు పుష్పించాయి. దిరిసెన పూలతో అడవి కైపెక్కింది. రాకుమారుడు ఒంటరిగా చిత్రగిరికి బయలుదేరి వెళ్ళాడు.

"ఎక్కడికి ప్రయాణం?" అని అడిగారు అందరూ. రాకుమారుడు ఏమీ జవాబు చెప్పలేదు.

కొండ గుహలోంచి ఒక సెలయేరు పుట్టింది. అది పోయి కామ్యక్ సరోవరంలో కలుస్తుంది. ఆ సెలయేటి దగువ ఒక శిథిలమందిరంలో రాకుమారుడు బసచేశాడు.

ఒక నెల గడిచిపోయింది. చిగురుటాకులన్నీ ముదురు రంగుకు తిరిగాయి. రాలిన పూలతో అడవిమార్గం పూడి పోయింది. ఇలా ఉంటూవుండగా ఒకనాడు ప్రాతఃకాలపు స్వప్నంలో రాకుమారునికి మురళీగానం విన్పించింది. నిద్ర నుంచి మేల్కొంటూనే "ఇవాళ తప్పక దర్శనం దొరుకు తుంది" అనుకున్నాడు రాకుమారుడు.

*　　　*　　　*

రాకుమారుడు గుర్రా న్నెక్కి కామ్యక్ సరోవరతీరానికి చేరుకున్నాడు. పర్వతప్రాంతపు యువతి సరోవరతీరాన కలువపూలు చూస్తూకూర్చునిఉంది. ప్రక్కనే నీళ్ళబిందె ఉంది. రాకుమారుని చూసి ఆమె అక్కడినుంచి కదలలేదు. ఆ నల్లపిల్ల నల్లని శిరోజాలలో ఒకదిరిసెనపువ్వుం ధరించింది. నల్లని శిరోజాలలో ఆ దిరిసెనపుష్పం సాయంసమయపు నక్షత్రం ఉదయించినట్లు ఉంది.

రాకుమారుడు గుర్రంనుంచి దిగి "ఆ దిరిసెనపుష్పం నా కిస్తావా?" అని అడిగాడు.

భయమనేది యెలా ఉంటుందో తెలియని లేడివలెఉంది ఆమె. వయ్యారింగా మెడ త్రిక్కించి రాకుమారునివైపు రెప్ప

వేయకుండా చూసింది. అప్పుడామె నల్లని నేత్రాలమీద ఒక విధమైన నీడ మరింతగా నల్లగా పడింది – నిద్రలోని స్వప్నంవలె, దిగంతంలో ప్రథమశోభ వ్యాపించినట్లుంది.

బాలిక పుష్పాన్ని తీసి రాకుమారుని చేతికిస్తూ "ఇదుగో తీసుకో" అని అంది.

"నిజం చెప్పు. నువ్వు ఏ అప్సరసవు" అని అడిగాడు రాకుమారుడు.

ఆ మాట వినగానే ఆమె ముఖంలో విస్మయం ఆవరించింది. తిరునాటి అకస్మాత్తుగా వర్షించే ఆశ్వయుజమాసపు మేఘంవలె ఆమె కిలకిలా పకపకా ఒకటే నవ్వు నవ్వసాగింది. ఆ నవ్వు ఒకంతట ఆగేట్టు కన్పించలేదు.

"నా స్వప్నం ఫలించినట్లుంది – ఈనవ్వు స్వప్నంలో విన్పించిన మురళీగానంవలెనే ఉంది" అనుకున్నాడు రాకుమారుడు మనసులో.

రాకుమారుడు గుర్రాన్నెక్కి తన రెండుచేతులు చాచి "రా" అని ఆమెను ఆహ్వానించాడు.

ఆమె అతని చేతులు పట్టుకుని గుర్రంమీది కెక్కింది. ఆమె వెనకాముందాడలేదు. లేశమైనా భయపడలేదు. నీళ్ళబిందె అక్కడే ఉండిపోయింది.

దిరిసెన చెట్టుమీదినుంచి కోయిల కూసింది. రాకుమారుడు ఆమె చెవిలో "నీ పేరేమిటి?" అని అడిగాడు.

"నాపేరు కాజరి" అని చెప్పిందామె.

ఇద్దరూ సెలయేటి తీరాన ఉన్న మందిరానికి చేరుకున్నారు. "ఇక నువ్వు నీ నిజస్వరూపం చూపించు" అని అడిగాడు రాకుమారుడు.

"మేము వనవాసులం. మాకు మారువేషాలేమిటో తెలియవు" అంది ఆమె.

"నేను నీ అప్సరసరూపాన్ని చూడాలనుకుంటున్నాను" అన్నాడు రాకుమారుడు.

"అప్సరస రూపమా! మళ్ళీ అదే నవ్వు! ఎడతెగని నవ్వు! "ఈమె నవ్వు ఈ సెలయేటి గానంవలెనే ఉంది. కనుక ఈమె సెలయేటి అప్సరసే" అనుకున్నాడు రాకుమారుడు.

* * *

రాకుమారుడు అప్సరసను వివాహమాడాడని మహారాజుగారికి వార్త తెలిసింది. రాజభవనంనుంచి గుర్రాలు, ఏనుగులు, విలువైన వాహనములు వచ్చాయి.

"ఇవన్నీ ఎందుకు?" అని అడిగింది కాజరి.

"నువ్వు రాజభవనానికి రావాలి" అన్నాడు రాకుమారుడు.

అప్పుడు ఆమె కళ్ళనిండా నీళ్లు నిండాయి. తన బిందె ఆ సరోవరతీరానే పడిఉన్న సంగతి ఆమెకు గుర్తొచ్చింది. ఆమె తన ఇంటిముంగిట గడ్డి విత్తనాలు ఎండబెట్టి వచ్చింది. తండ్రీ, అన్న వేటకు వెళ్ళారు. వాళ్ళు తిరిగివచ్చే సమయమయింది. తన వివాహసమయములో కట్నంగా ఇచ్చేందుకు తల్లి కూని

రాగంతీస్తూ ఇంటిముందు చెట్టుక్రింద కూర్చొని మగ్గంమీద బట్టనేస్తూ ఉంది – ఈ విషయాలన్నీ ఆమెకు గుర్తొచ్చాయి.

"నేను రాను" అంది ఆమె. కాని ఒకేసారి రకరకాల వాయిద్యాలు మ్రోగాయి. ఆమెమాట ఎవరికీ విన్పించలేదు.

ముత్యాల పల్లకీలోంచి కాజరి రాజభవనంలో అడుగిడినప్పుడు మహారాణి ఆమెనుచూసి తలబాదుకుంటూ "ఛీ! ఇదెక్కడి అప్సరస?" అని మొత్తుకుంది.

రాకుమారుని సోదరి "ఛీ! ఛీ! సిగ్గుచేటు" అని అంది.

మహారాణీగారి దాసి "అప్సరసవలెనే ఆ జుట్టుకూడా ఉంది" అని అంది.

"ఎవరూ మాట్లాడకండి. అప్సరస మన భవనానికి మారు వేషంలో వచ్చింది" అని చెప్పాడు రాకుమారుడు.

*　　　*　　　*

రోజులు గడుస్తున్నాయి. వెన్నెల రాత్రులయందు రాకుమారుడు నిద్రలేకుండా మేల్కొని కాజరి వేషం మార్చి అప్సరసరూపంలో కన్పిస్తుందేమో అని ఎదురుచూస్తూ ఉండేవాడు. కాని ఆమె నల్లని శిరోజాలు విరబోసుకుని నల్లరాతితో చెక్కిన విగ్రహంవలె కన్పించేది. ఆమెను చూస్తూ రాకుమారుడు "రాత్రి చివరిజామునందు దాగిన వెలుగువలె ఈమెలో అప్సరస ఎక్కడ దాగిఉంది" అని ఆలోచించేవాడు.

రాకుమారునికి స్వజనులముందు తిరగటం చాలా సిగ్గుగా ఉంది. ఒకనాడు అతనికి కోపంకూడా వచ్చింది. కాజరి ఉదయం నిద్రనుంచి లేస్తూఉండగా అతడు ఆమె చేతిని

గట్టిగా పట్టుకుని ఇవ్వాళ నేను నిన్ను వదలను. నీ నిజ రూపాన్ని చూపించక తప్పదు" అన్నాడు.

ఇలాంటిమాట వినే అడవిలో ఆనాడు కాజరి గలగలా నవ్వింది. ఇవ్వాళ ఆమె నవ్వలేదు. ఆమె కళ్ళనిండా నీళ్ళు నిండాయి.

"నువ్వు నన్ను చిరకాలం ఇలాగే మోసగిస్తావా?" అని అడిగాడు రాకుమారుడు.

"లేదు, ఇక మోసగించను" అంది కాజరి.

"అలా అయితే ఈసారి కార్తీకపూర్ణిమ రోజున అందరూ నీ అప్సరస రూపాన్ని చూడగలగాలి" అన్నాడు రాకుమారుడు.

*                    *                    *

పౌర్ణమి వచ్చింది. పూర్ణచంద్రుడు ఆకాశం మధ్య భాగాన ఉన్నాడు. రాజభవనంలో సన్నాయి మధురంగా వినిపిస్తుంది.

రాకుమారుడు పెళ్ళికుమారుని దుస్తులు ధరించి పూలమాల చేతితో పట్టుకుని బయలుదేరాడు. ఇవాళ మొదటి సారి అప్సరస భార్యను చూడబోతున్నాడు.

పడకగదిలో పాన్పుపై తెల్లని పట్టుదుప్పటి పరిచి ఉంది. పాన్పునిండా మల్లెపూల దొంతరలు పడిఉన్నాయి. వాటి మీద కిటికీలోనుంచి తెల్లనివెన్నెల కిరణాలు పడుతున్నాయి.

మరి, కాజరి ఏది?

ఆమె ఎక్కడా లేదు.

మూడో జామున మురళీగానం విన్పించింది. పూర్ణ చంద్రుడు పశ్చిమాద్రికి చేరుకున్నాడు. బంధుజనంతో రాజ భవనం నిండిపోయింది.

అప్సరస ఏది?

"వెళ్ళేముందు అప్సరస తన పరిచయం చెప్పి వెళు తుంది. తిరిగి ఆమెను పొందలేము" అన్నాడు రాకుమారుడు.

---

# ఆగంతకుడు

ఏర్పాట్లు చురుకుగా సాగుతున్నాయి. ఈ ఏర్పాటు ఏమిటో ఆలోచించడానికి లేశమైనా తీరిక దొరకటంలేదు.

అయినప్పటికీ అన్ని వత్తిడిపనుల్లోనూ ఒక్కొక్కసారి మనస్సును నెట్టి "ఎవరో వస్తున్నారనుకుంటాను" అని అడిగే వాడిని.

"కాసేపు మాట్లాడించకు. చోటు చూసుకోవాలి. వస్తువులన్నీ సమకూర్చుకోవాలి. ఇల్లూ వాకిలీ ఏర్పరచు కోవాలి. ఇలాంటి సమయాల్లో వ్యర్థంగా నన్నేమీ ప్రశ్నిం చకు" అనేది మనస్సు.

మొదలకుండా మళ్ళీ పనిలో మునిగిపోయేవాడిని. చోటు దొరుకుతుంది. కావలసిన వస్తువులన్నీ సమకూరుతాయి, అలాంటప్పుడు ఇల్లూ వాకిలి కూడా ఏర్పడుతాయి – అప్పుడైనా సమాధానం వస్తుందిగదా అని ఆలోచించేవాడిని.

స్థల విస్తారం హెచ్చిపోతుంది. వస్తువులుకూడా సమృద్ధిగా లభించాయి. ఏడంతస్తుల భవనం లేచింది. అప్పుడు నేను "ఇప్పుడైనా నేనడిగిన దానికి జవాబు చెప్పు" అని అడిగాను.

"ఇంకా కొంతకాలం ఆగు. నాకు తీరికలేదు" అంది మనస్సు.

"ఏం, ఇంకా స్థలం కావాలా? నామాన్లు చాలలేదా? భవనం ఇంకా లేవాలా?" అని అడిగాను నేను.

"తప్పకుండా కావలసిందే" అంది మనస్సు.

"ఇంతటితో చాలదా?" మళ్ళీ ప్రశ్నించాను నేను.

"ఇంత మాత్రానికే పనెలా జరుగుతుంది?" అంది మనసు.

"ఇదంతా ఎందుకు? ఎవరికోసం?" అడిగాను.

"ఆ సంగతులు తరువాత మాట్లాడదాం" అంది మనసు.

"అవన్నీ గొప్ప సంగతులనుకుంటాను" అన్నాను మళ్ళీ నేను.

ఇంత విశాలమైన స్థలం: ఇంతపెద్ద భవనం ఉన్నప్ప

టికి పని జరుగదలు. మళ్ళీ నేను ఏకాగ్రతతో పనిలో మునిగి పోయాను. రాత్రులు నిద్రలేదు. పగలు విశ్రాంతిలేదు. చూసిన వాళ్ళంతరూ "నిజంగా, చాలా పనిమంతుడు" అని నన్ను మెచ్చుకున్నారు.

ఒక్కొక్కప్పుడు నాకేవేవో సందేహాలు వస్తూ ఉండేవి. ఆ కోతి మనసుకు మరో సమాధానమే తెలియ నట్లుంది. అందుకని అది చెవులు మెలిపెట్టి జవాబు చెప్ప కుండా తప్పుకుంటుంది. . ఒక్కోసారి పనిచేయటం మాని చెవులు రిక్కించి ఎవరైనా వస్తున్నారేమో వినాలనిపిస్తుంది. ఇంతటితో భవన నిర్మాణం ఆపి దానిలో దీపం వెలిగి ద్దామా అనిపిస్తుంది. వివిధరకాల ఈ అలంకార సామగ్రిని సమకూర్చటం మాని పుష్పాలు వికసిస్తున్నప్పుడే మాల గుచ్చుదా మనుకుంటాను.

కాని సాహసించలేకపోతున్నాను. మనసు నాకు ప్రధాన మంత్రి. అది అనుక్షణం త్రాసుపట్టుకొని, గజం బద్ద తీసుకొని అన్నిటినీ పరీక్షించి కొలుస్తూ ఉంటుంది. "ఇంకా పని జరగాలి, లేకపోతే ప్రయోజనం ఉండదు" అనే అది ఎప్పుడూ చెపుతూ ఉండేది.

"ఎందుకని?"

"అతడు చాలా గొప్పవాడు"

"ఎవరు చాలా గొప్ప...?"

"చాలు, చాలు... మరేమీ మాట్లాడకు."

"ఈ విధంగా తప్పించుకుంటే లాభంలేదు. సమాధానం చెప్పక తప్పదు" అని నేను నొక్కి అడిగినప్పుడు అది కోపంతో మండిపడుతూ "జవాబు చెప్పకుండా తప్పనంత విషయ మేముంది? అసలు జాడ తెలియదే. దాని తీరూ తెన్నూ, దాని అర్థం తెలుసుకోగల మార్గమే తెలియదు. అలాంటి విషయాలు పట్టుకొని నువ్వు నా పనులకు విఘ్నం కల్గిస్తున్నావు. నాకున్న సమస్యల్నికూడా కాస్త గమనించు, ఎన్ని వ్యవహారాలు, ఎన్ని తగాదాలు, బరిసెలు లాఠీలు, సైనికులు, తుపాకులతో పేటపేట నిండిపోయింది. కూలీలు, మేస్త్రీలు, ఇటుకలు, కలప, సున్నము వివిధ వస్తుసామగ్రితో కాలు పెట్టేసందు లేకుండా ఉంది. అన్నీ స్పష్టంగా కన్పిస్తూనే ఉన్నాయిగదా, ఇందులో నిష్ప్రయోజన మేదీలేదే. అర్థం కానిదీ లేదు. కళ్ళ ఎదుట కన్పించే వీటన్నిటినీ వదలి ప్రశ్న లెందుకు చెప్పు?" అనేది.

ఇదంతా విన్నప్పుడు "నాకంటే మనసే తెలివైనది. నేనే తెలివితక్కువవాడిని" అని ఆలోచించేవాడిని. అంతే, మళ్ళీ ఇటుకలు. సున్నం చేరుస్తూ ఉండేవాడిని.

* * *

ఈ విధంగానే రోజులు దొర్లిపోతున్నాయి. నా స్థలం దిగంతాన్ని దాటి పోయింది. భవనం అయిదో అంతస్తు తయారయింది. ఆరో అంతస్తు తయారవుతూ ఉం . అలాంటి సమయంలోనే ఒకనాడు ఆకాశంలో పట్టిన మబ్బులు తేలిపోయాయి. నల్లని మేఘాలు తెల్లగా మారాయి. కైలాస

శిఖరంనుంచి ఆట విడుపు వాయువు భైరవి రాగాలాపనతో బయలు దేరింది. మానస సరోవరంలోని కమలముల సువాసన నిత్యదండ ప్రహారములను తేనెటీగల వలె మత్తెక్కిస్తుంది. నేను తలపైకెత్తి చూశాను. నా అరంతస్తుల భవనానికి అతి ఉన్నతంగా నిర్మించిన వెదురు మెట్లవేపు చూస్తూ ఆకాశం పకపక నవ్వింది.

నేను వ్యాకులతతో కన్పించిన వాళ్ళందరినీ ఆపి "అయ్యా, ఇవాళ విన్పిస్తున్న సన్నాయి ఏవాయు గుడారం నుంచి విన్పిస్తుంది" అని అడగసాగాను.

"ఉండవయ్యా, మాకు పని ఉంది" అన్నారు అందరూ.

తలకు పూలమాల చుట్టుకొని ఒక పిచ్చివాడు దారి ప్రక్క చెట్టును ఆనుకొని మొదలకుండా కూర్చొని ఉన్నాడు.

నా ప్రశ్నకు అతడు "ఆగంతకుని రాకను తెలియజేయు గానం విన్పించింది" అని చెప్పాడు.

నేనేమి అర్థంచేసుకున్నానో చెప్పలేనుకానీ "అయితే ఇక ఆలస్యంలేదు" అన్నాడు.

అతడు నవ్వి "కాదు, అతడు వస్తూవుంటాడు" అని అన్నాడు.

అప్పుడు నేను ఖజానాకువచ్చి నా మనసుతో "ఇక నీపని ఆపు" అని చెప్పాను.

"నువ్వనేదేమిటి! ప్రజలు పనికిమాలిన వాడవని అంటారు" అని అంది మనసు.

"అంటే అననివ్వు" అన్నాను నేను.

"ఏం జరిగింది నీకు. నీకేమైనా తెలిసిందా?" అని అడిగింది మనసు.

"అవును తెలిసింది."

"ఏమిటది?"

"కష్టమే, స్పష్టంగా చెప్పలేను. కాని, మానససరోవర తీరాన్నుంచి వెలుగుమార్గాన ఎగురుతూ పెద్ద బాతులగుంపు వచ్చిందని విన్నాను."

మనసు తలాడించి "ఆ మహారథ శిఖరాగ్రం ఎక్కడా కన్పించనిదే? ఆ వేడుకలు, ఉత్సాహం కన్పించటంలేదు, విన్పించటంలేదు" అని అంది.

చూస్తూఉండగానే పరసు వేది తాకినట్లు ఆకాశమంతా బంగారు కాంతితో ప్రకాశించ సాగింది. ఎక్కడినుంచో "దూత వచ్చాడు" అనే ధ్వని విన్పించింది.

నేను భూమిమీద సాష్టాంగపడి దూతకు నమస్కరించి "వస్తున్నారా ఏం?" అని ప్రశ్నించాను.

"అవును, వస్తున్నారు" అనిఅన్నివైపులనుంచిజవాబు విన్పించింది.

మనసు తికమకపడుతూ "ఇప్పుడేంచేయాలి, ఆరో అంతస్తు ఇంకా పూర్తిగా తయారవలేదు రావలసిన సామాగ్రి ఇంకా రానేలేదు" అని అంది.

"పడగొట్టు, పడగొట్టు! ఆరంతస్తుల భవనాన్ని వెంటనే పడగొట్టు" అని జవాబు వినిపించింది.

"ఎందుకని?" అని అడిగింది మనసు.

"ఇవాళ శుభాగమనం నీభవనం రొమ్ము విరుచుకొని మార్గాని కడ్డంగా నిలబడివుంది" అని జవాబువచ్చింది.

మనసు మరి మాట్లాడలేకపోయింది.

"ఆ అలంకార సామాగ్రినంతా పారవెయ్యి" అని వినిపించింది మళ్ళీ.

"ఎందుకు?" అని ప్రశ్నించింది మనసు.

"నీ సామాగ్రి గుట్టలుపడి ప్రదేశాన్నంతా ఆక్రమించుకుంది."

పోనివ్వు. పనిఉన్న రోజుల్లో కూర్చుని ఆరంతస్తుల భవనాన్ని నిర్మించాను. శలవుదినాల్లో ఒక్కొక్క అంతస్తునే పడగొట్టి నేలకూల్చవలసి వచ్చింది. పనిరోజుల్లో యెక్కడెక్కడి అలంకారాలను సమకూర్చి బజార్లనిండా నిల్వ ఉంచాను. ఇప్పుడు శలవుదినాల్లో యెక్కడి వాటి నక్కడే పారవేశాను.

మరి ఆ బ్రహ్మాండమంత మహారథ శిఖరం కనిపించదేమిటి, ఆ ఉత్సవం సాగి రాదేమిటి?

మనస్సు ఒకసారి చుట్టూ పరిశీలించచూసింది. దానికి కన్పించిందేమిటి?

శరత్కాలపు ఉదయతార.

అంతేనా?

అవును, అంతే. పూలచెట్లు, పూలు కన్పించాయి.

అంతేనా?

అవును, అంతే. ఉదయమే మేల్కొంటూ శోకలాడి స్తున్న జోడుపక్షులు కన్పించాయి.

ఇంకేమి కన్పించాయి!

మరొకబిడ్డ. అతడు కిలకిల నవ్వుతూ తల్లి ఒడిలోనుంచి పరుగెత్తుకుంటూ బయటి వెలుగులోకి వచ్చాడు.

"నువ్వు ఆగంతకుడని చెప్పావే, ఇదంతా ఇతని కోసమేనా?"

"అవును, ఇతనికోసం ప్రతినిత్యము ఆకాశంలో మురళీగానం విన్పిస్తుంది; ప్రాతఃకాలపు వెలుగు యితనికోసమే వస్తుంది."

ఇతనికోసమే నేను స్థలంకోరినది.

"అవునండీ, మీ రాజుగారికి యేడంతస్తుల భవనం ఉంది. మీ ప్రభువుకు యింటినిండా వస్తుసామాగ్రి ఉంది. మరి, వీళ్ళకు_ఈ ఆకాశము, భూమి సమస్తము వీరికోసమే"

"అతడు అంత పెద్దవాడా?"

"చాలాపెద్దవాడు, అంతచోటు నిండిఉంటాడు."

"ఆ శిశువు నీకేమి వరం ఇస్తాడు?"

"అతడేసృష్టికర్తవరంతో వస్తున్నాడు. సమస్త పృథ్వీతలంలోని అగ్నినీ, అభయాన్నీ, ఆనందాన్నీ, తెస్తాడు అతని రహస్యతూణంలోని బ్రహ్మాస్త్రం దాగివుంటుంది. అతని హృదయంలో మహాశక్తి శైలము దాగివుంది.

మనసు నన్ను చూసి "ఏమయ్యా కవీ, నువ్వు ఇదంతా చూశావుగదా, ఏమైనా తెలిసిందా?" అని అడిగింది.

"అందుకే నేను శలవు తీసుకున్నాను. ఇంతకాలం నాకు అవకాశం లేనందువల్ల నేను ఆతనిని చూడలేకపోయాను. తెలుసుకోలేకపోయాను" అని జవాబు చెప్పాను నేను.

---

# కానుక

కాళీపూజ దగ్గరకొచ్చింది సామాన్లగది వివిధ వస్తు సామాగ్రితో నిండిపోయింది. బెనారసు చీరలెన్నోఉన్నాయి, నగలున్నాయి పాలపెరుగు పాత్రలనేకం, బుట్టలనిండా రక రకాల మిఠాయి లున్నాయి.

దిమ్మ కానుకలు పంపుతూ వుంది.

పెద్దకుమారుడు యెక్కడో దూరదేశాన మహారాజు గారివద్ద ఉద్యోగం చేస్తున్నాడు. రెండో కుమారుడు పెద్ద వ్యాపారి. ఇంటివద్ద వుండనే ఉండడు. ఇంకా కుమార్లు ఉన్నారుగాని వాళ్ళందరూ పరస్పరం దెబ్బలాడుకుని వేరుపడి యెవరి సంసారం వాళ్ళు చూసుకుంటున్నారు బంధుజనం దేశ విదేశాల్లో అనేకచోట్ల ఉన్నారు.

తల్లిఒడిలో పెరుగుతున్న చిన్నపిల్లాడు యింటి ముఖ ద్వారంలో నిలబడి కావిళ్ళతో, పళ్ళెములతో బుట్టలనిండా వెళుతున్న కానుకల్ని చూడసాగారు. సాయంత్రంవరకు తెరిపి లేకుండా కానుకలు వెళుతూనే ఉన్నాయి.

సాయంత్రమయింది. అందరికీ కానుకలు వెళ్ళాయి. దినాంతమందు ఆఖరి నైవేద్యరూపంలో చెట్లమీది బంగారు కాంతిని తీసుకొని సూర్యాస్తమయపు అంతిమకాంతి నక్షత్ర లోకమార్గాన అదృశ్యమయింది.

*　　　*　　　*

బాలుడు ఇంట్లోకివచ్చి తల్లితో "అమ్మా, నువ్వు అందరికి కానుకలు పంపావు, నాకేమీ ఇవ్వలేదు" అని అడిగాడు.

తల్లి అతనివైపుచూసి "అందరికీ కానుకలు పంపాను_ ఇప్పుడు నీకోసం ఏమి మిగిలిందో చూడు" అంటూ బాలుని ఫలాటాన్ని ముద్దుపెట్టుకుంది.

బాలుడు ఏడుపు నభినయిస్తూ "నాకు కానుకలు ఇవ్వవా" అని అడిగాడు.

"నువ్వు నాదగ్గర లేనప్పుడు, దూరదేశాలకు వెళ్ళి ప్పుడు నీకూ కానుకలు పంపుతాను" అని అంది తల్లి.

"నీ దగ్గరే ఉంటే నీచేతితో నాకేమీ ఇవ్వవా" అని అడిగాడు బాలుడు.

తల్లి రెండుచేతులూ చాచి అతనిని ఒడిలోకి తీసుకుంది; "ఇదే నా చేతులతో ఇచ్చేకానుక" అని అంది.

# రథోత్సవం

రథోత్సవం జరుగబోతుంది. మహారాణి రాజుగారితో "రథోత్సవం చూడటానికి వెళదాం" అని అంది.

"అలాగే" అన్నారు మహారాజుగారు.

గుర్రాలు, ఏనుగులు, రకరకాల వాహనాలు బయలు దేరాయి. వాటివెనుక సైనికులు, ఆ వెనుక దాసదాసీజనం బయలుదేరారు.

రథోత్సవం చూడటానికి బయలుదేరకుండా ఒకమనిషి మాత్రం మిగిలిపోయాడు. రాజభవనానికి కావలసిన చీపురు పుల్లలు ఏరి తేవటం అతనిపని. సర్దారు అతనియందు దయ తలచి "రథోత్సవం చూడాలనుకుంటే నువ్వుకూడా మా వెంటరా" అని చెప్పాడు.

అతడు చేతులుజోడించి "నే నింకెక్కడికి వచ్చేది బాబూ!" అన్నాడు.

అందరూ వెళుతున్నారు, ఆ దుఃఖితుడు ఒక్కడూ రావటంలేదని రాజుగారికికూడా తెలిసింది.

రాజుగారికి దయకలిగింది. మంత్రిని పిలిచి "అతనిని కూడా తీసుకురండి" అని ఆజ్ఞాపించాడు.

అతని ఇల్లు దారిప్రక్కనే ఉంది. ఏనుగులు అక్కడికి చేరాయి. మంత్రి అతనిని పిలిచి "ఓయీ, దైవదర్శనానికి రావా, బయలుదేరు" అన్నాడు.

అతడు మహామంత్రికి నమస్కరించి "ఎంతదూరమని

నడవగలను బాబూ! దేవుని సాన్నిధ్యంవరకు నడిచి రాగల శక్తి నా కెక్కడిది?" అని అన్నాడు.

"మరేమీ భయంలేదు, మహారాజుగారి వెంట వెళ్ళ వచ్చు" అన్నాడు మహామంత్రి.

"సర్వనాశనం! మహారాజుగారి మార్గం నామార్గమవు తుందా?" అన్నాడు దుఃఖితుడు.

"అయితే మరి నీ సంగతేలా? రథోత్సవంచూచే అదృష్టం లేదా నీకు?" అని అడిగాడు, మంత్రి.

"తప్పకుండా చూస్తాను; దేవుడు రథాన్నెక్కి నా కుటీర ద్వారంముందుకు వస్తాడు" అన్నాడు అతడు.

మంత్రి అతనిమాటలకు నవ్వి "నీ యింటిముందు ఆ రథ చిహ్నా లెక్కడా లేవే? అని అడిగాడు.

"భగవానుని రథం వచ్చినజాడలు కన్పించవు."

"ఎందుకని?"

"భగవానుడు పుష్పకరథంమీద వస్తాడు."

"ఆ రథం ఎక్కడ ఉంది."

దుఃఖితుడు మహామంత్రికి ఆ రథాన్ని చూపించాడు. అతని ద్వారాని కిరువైపులా రెండు పొద్దు తిరుగుడుపూలు వికసించి వున్నాయి.

—∞—

# ఏరా సరా

మీనూ పడమటి ప్రాంతంలో పుట్టిపెరిగింది, చిన్నతనంలో ఆమె నూతిదగ్గరఉన్న చెట్టెక్కి పళ్లుకోస్తూ ఉండేది. కండిచేతో గడ్డికోసే ముసలివానితో ఆమెకు మంచిస్నేహం. యుక్తవయస్సురాగానే మీనూ వివాహం జరిగింది. అత్తవారిల్లు జోన్‌పూర్. పెళ్ళయిన సంవత్సరానికే ఒక మగపిల్లాడు జన్మించి చనిపోయాడు. “ఈమెకూడా బ్రతుకుతుందనే నమ్మకం లేదు” అని చెప్పారు డాక్టరు.

అప్పుడు ఆమెను కలకత్తా తీసుకువెళ్ళారు.

ఆమె వయస్సుకూడా చాలాతక్కువ. పచ్చికాయవలె ఆమె అపరిపక్వప్రాణిం భూమికొమ్మను గట్టిగా పట్టుకుని ఉంది. మెత్తనివస్తువులన్నా, పచ్చనివస్తువులన్నా, ఇతర ప్రాణులన్నా ఆమెకు చాలా ఇష్టం.

ఇంటిముంగిట పదిపన్నెండు గజాల స్థలంఉంది. దానిలోనే ఆమె ఉద్యానం ఉంది.

ఆ తోట ఆమెకు కన్నబిడ్డతోసమానం. ఆ తోటలోనే ఆమె మాలతీలతను వేసింది. ఆ లత బాగా అల్లుకుని పువ్వు తొడుగుతూ ఉండగా ఆమె వచ్చేసింది.

ఆ పేట మొత్తంలో ఉండే పెంపుడుకుక్కలకు, బజారు కుక్కలకు ఆమె ఇంట్లోనే భోజనం దొరికేది, వాటిలో ఒక చప్పిడిముక్కు కుక్కను ఆమె చాలా ప్రేమించేది.

దాని మెడలో కట్టటానికి రంగురంగుల పూసలతో దండగుచ్చటానికి ప్రారంభించి అది పూర్తికాలేదు. ఆ కుక్క గల యజమాని "వదినా, దీనిని నువ్వు తీసుకువెళ్ళు" అని చెప్పాడు మీనూతో.

"ఇదొక తగలాటం – వద్దు, వద్దు" అన్నాడు మీనూ భర్త.

*　　*　　*

కలకత్తాలో రెండంతస్తుల భవనంలోని ఒక గదిలో మీనూ పడుకొని ఉంటుంది. ఒక హిందూస్తానీ దాది ఆమె చెంతనే కూర్చొని ఏవేవో చాలా సంగతులు మాట్లాడుతుంది. మీనూ కొన్ని మాటలు వింటుంది. కొన్ని వినసే వినదు.

ఒకరోజు రాత్రంతా మీనూకు కంటిమీద కునుకే లేదు. తెల్లవారుజామున మసకచీకటికూడా తొలగి వెలుగు వచ్చింది. కిటికీకి ఎదురుగా క్రింది తోటలో సంపెంగ చెట్టు పూలతో నిండివుంది. ఆ పూల కమ్మనివాసన గదిలోకి వచ్చి మీనూను "ఎలా ఉన్నావు?" అని పలకరించినట్లుంది.

ఆమె ఉంటున్న భవనానికి, ప్రక్కనే ఉన్న భవనానికి మధ్య ఉన్న ఖాళీజాగాలో నీడగా ఉంటుంది. ఎండ సోకని ఆ నీడలో ఈ దరిద్ర వృక్షం, విశ్వప్రకృతియొక్క ఈ బిడ్డడు ఏదో గాలిపాటుకు ఇక్కడపడి నిలదొక్కుకున్నట్లుంది.

అలసిపోయిన మీనూ బాగా ప్రొద్దెక్కిన తరువాత నిద్రలేచేది. లేవగానే కిటికీలోనుంచి ఆ చెట్టువైపే చూస్తూ కూర్చునేది. ఇప్పుడు మునుపటివలె చెట్టున పువ్వులు ఎక్కు

వగా కన్పించటంలేదు. వెంటనే మీనూ దాదిని పిలిచి "ఇదుగో దాదీ, నామీద ఒట్టు. ఆ చెట్టుమొదట కొంచెం త్రవ్వి నీళ్లుపోస్తూవుండు, నీకు పుణ్యముంటుంది" అని అంటూ వుండేది.

ఈమధ్య ఆ చెట్టున పువ్వులు ఎక్కువగా పూడని కారణం ఏమిటో కాస్సేపటికే ఆమెకు అర్థమయింది.

అప్పుడప్పుడే వికసిస్తున్న కమలపుష్పంవలె ప్రాతః కాలపు వెలుగు వ్యాపిస్తూఉంది. సరిగ్గా అదేసమయంలో ఒక పూజారిగారు వచ్చి చెట్టుకొమ్మను గట్టిగాపట్టుకుని వూపుతూ పువ్వులు రాల్చసాగారు. శిస్తు వసూలుకు జప్తు ఆర్డర్లతో వచ్చిన బంట్రోతువలె కన్పించాడా పూజారి ఆమెకు.

మీనూ దాదిని పిలిచి "దాదీ, వెంటనేవెళ్ళి ఆ పూజారి గారిని ఇక్కడికి పిలుచుకురా" అని అంది.

పూజారి అక్కడికి రాగానే, ఆమె అతనికి నమస్కరించి "పూజారిగారూ, మీరు ఎవరికోసం ఈ పువ్వులు తీసుకు వెళుతున్నారు?" అని అడిగింది.

"దేవునికోసం" అని చెప్పాడు పూజారి.

"ఆ దైవుడే ఈ పుష్పాలను నావద్దకు పంపాడు" అని అంది మీనూ.

"నీవద్దకు పంపాడా."

"అవును, నావద్దకే. ఆయన నాకిచ్చినా తిరిగి తీసుకోటానికి కాదుకదా!"

బ్రాహ్మణుడు విచారిస్తూ అక్కడినుంచి వెళ్ళి పోయాడు.

మర్నాడు ఉదయం మళ్ళీ ఆ పూజారి వచ్చి చెట్టు పువ్వులను కోసుకువెళ్ళటం చూసి మీనూ దాదిని పిలిచి "కళ్ళతో చూస్తూ నే నిది భరించలేను. నా మంచాన్ని ప్రక్క గదిలోకి మార్పించు" అని చెప్పింది.

*　　　*　　　*

ప్రక్క గది కిటికీకి ఎదురుగా రాయ్‌చౌదరిగారి నాలు గంతస్తుల భవనం ఉంది. మీనూ భర్తను పిలిచి "ఇదుగో, చూడండి – అటు చూడండి. వాళ్ళబ్బాయి ఎంత అందంగా ఉన్నాడు – ముద్దొస్తున్నాడు. ఒకసారి ఇక్కడికి తీసుకు వస్తారా" అని అడిగింది.

"వాళ్లు గొప్ప ధనికులు – పేదవాళ్ళదగ్గరకు వాళ్ళబ్బాయిని పంపరు" అన్నాడు భర్త మీనూతో.

"మీరు మరీ విచిత్రంగా మాట్లాడుతున్నారండీ! చిన్న పిల్లలకుకూడా ధనికులనీ, పేదలనీ తేడాలుంటాయా? ఎవరి ఒడిలోనైనా సరే పసివారికి మహారాజ సింహాసనం ఉంటుంది" అని అంది మీనూ భర్త మాటలకు ఆశ్చర్య పడుతూ.

భర్త తిరిగివచ్చి "గేటువద్ద కాపలా జవాను బాబు గారిని కలుసుకోటానికి వీల్లేదన్నాడు" అని చెప్పాడు.

మర్నాడుసాయంత్రం మీనూ దాదిని పిలిచి "అదుగో దాదీ, అటు చూడు! వాళ్ళబ్బాయి తోటలో ఒక్కడే ఆడు కుంటున్నాడు. త్వరగా వెళ్ళి ఆ బాబుకు ఈ మిఠాయి ఇచ్చి రా" అని చెప్పింది.

ఆ సాయంత్రమే భర్త ఆమెవద్దకు వచ్చి "ఎదురింటి వాళ్ళకు కోపం వచ్చింది" అని చెప్పాడు.

"ఎందుకు, ఏం జరిగింది" అని అడిగింది మీనూ.

"ఈసారి గనుక దాది వాళ్ళ తోటలోకి వస్తే పోలీసు లకు అప్పజెబుతామన్నారు" అన్నాడు భర్త.

మీనూ కళ్లు కన్నీళ్ళతో నిండిపోయాయి – "నేను చూశాను, వాళ్లు బాబు చేతుల్లోనుంచి మిఠాయి లాగి పారేశారు – బాబును దండించారు. ఇక నేనిక్కడ ఒక క్షణంకూడా ఉండలేను. నన్ను ఇంటికి తీసుకువెళ్ళండి" అంది మీనూ ఎటో చూస్తూ.

# కృతఘ్న శోకం

ప్రాతఃకాలమందే ఆమె నన్ను వెదలి వెళ్ళింది. "ఏముంది, అంతా మాయ" అని మనస్సు నన్ను ఓదార్చ సాగింది.

నాకు వళ్ళు మండిపోయింది: "బల్లమీద అగ్గిపెట్టె ఉంది, ఎదురుగా డాబామీద పూలకుండు లున్నాయి, మంచంమీద విసనకర్ర ఉంది – ఇవన్నీ సత్యమేకదా!" అన్నాను నేను.

"అయినా, ఆలోచించి చూడు" అంది మనస్సు.

"నువ్వు మాట్లాడకు – ఎదురుగా బల్లమీదున్న కథల పుస్తకంలో తలలో పెట్టుకునే పిన్ను ఉంది. అదికూడా మాయ అయేటట్లయితే, అంతకంటే మాయ జరిగిందెందు వల్ల?" అని అడిగాను నేను.

మనస్సేమీ జవాబు చెప్పలేదు. ఇంతలో ఒక మిత్రుడు వచ్చి "ఏదైతే మంచిదో అదే సత్యం. అది పోయేది కాదు; ప్రపంచమంతా దానిని రత్నంవలె హారముగా గుచ్చి ఉంచుకుంటుంది" అని అన్నాడు.

"నీ కెలా తెలిసిందోయ్? శరీరం మంచిది కాదంటావా – అలా అయితే మరి శరీరం ఎక్కడికి వెళ్ళిపోయుం దంటావ్?" అన్నాను నేను కోపంగా.

చిన్నపిల్లవాడు తల్లిని చిలిపిగా కొట్టినట్లు నేనుకూడా ప్రపంచంలో నాకున్న ఆశ్రయాన్ని కొట్టసాగాను. "ప్రపంచం విశ్వాస ఘాతకమైనది" అన్నాను నేను.

అకస్మాత్తుగా నేను ఉలిక్కిపడ్డాను. "ఛీ! కృతఘ్నుడా!" అని ఎవరో అంటున్నట్లుగా మనసులో మెదిలింది.

కిటికీలోనుంచి బయటకు చూశాను. వెళ్ళిపోయిన ఆమె నవ్వు దోబూచులాడుతున్నట్లు అప్పుడే తదియ చంద్రుడు ఉదయించాడు. ఆకాశంలో చెదిరి ఉన్న నక్షత్రాలనుంచి "నేను నీకు దక్కనదేమో మోసమూ, కొంచెం చాటు అయేసరికి ఇంత అసత్యమనే విశ్వాసమూ ఎలా కలిగింది" అని చీవాట్లు విన్పించాయి.

# ఒకనాడు

నాకు బాగా గుర్తుంది. మధ్యాహ్న సమయం. తెరలు తెరలుగా వర్షం ఆగి ఆగి కురుస్తూ ఉంది. మధ్యమధ్య గాలికూడా వీస్తుంది.

గదిలో చీకటి ఉంది. ఏ పనీ తోచటంలేదు. వీణ అందుకుని మేఘమల్హార్ రాగం వాయిస్తూ కూర్చున్నాను.

ప్రక్క గదిలోనుంచి ఆమె ఒకసారి ద్వారంవరకు మాత్రం వచ్చింది. తిరిగి వెళ్ళిపోయింది. తరువాత ఒకసారి బయటకు వచ్చి నిలబడింది. ఆ తరువాత నెమ్మదిగా లోనికి వచ్చి కూర్చుంది. ఆమె చేతిలో ఏదో కుట్టుపని ఉంది. మెదలకుండా తలవంచుకొని కూర్చొని తన పని చేసుకోసాగింది. తరువాత చేతిలో పనినాపి కిటికీలోనుంచి మసకగా కన్పించే చెట్లకేసి చూడసాగింది.

వర్షం ఆగిపోయింది. నా పాట ఆగిపోయింది. ఆమె లేచి తల దువ్వుకోటానికి వెళ్ళిపోయింది. అంతే, అంతకు తప్ప మరేమీలేదు. వర్షంలో పాటలో, తీరికలో, చీకట్లో మిళితమై ఉన్న ఆ మధ్యాహ్న సమయం.

చరిత్రలో రాజుల, మహారాజుల విషయాలు, యుద్ధము, సంధులను గురించిన విషయాలు కారుచీకటిగా నిండి ఉంటాయి. కానీ ఒకానొక మధ్యాహ్న సమయపు ఈ స్వల్ప విషయ భాగం దుర్లభమగు రత్నంవలె కాలపు పేటికలో దాగి ఉండిపోయింది. దానిని గురించి ఇద్దరికి మాత్రమే తెలుసు.

# సత్యకాముడు

గౌతమ మహర్షి ఆశ్రమం సరస్వతీ నదీ తీరాన ఉంది. అచ్చటి ప్రకృతి కడు రమణీయమైనది. కందమూల ఫలములు, కట్టెపుల్లలు తెచ్చుటకు వెళ్ళిన శిష్యబృందము ఆశ్రమానికి తిరిగి వచ్చింది. మేతకు వెళ్ళిన గోవులుకూడా ఆశ్రమానికి తిరిగి వచ్చాయి. సంతోషంతో కలవరం చేస్తూ బ్రహ్మచారులు స్నానం చేసివచ్చి మహర్షి చుట్టూ తమ తమ దర్భాసనాల నలంకరించి మధ్య విచిత్ర హోమాగ్ని ప్రజ్వరిల్లుతూ ఉంది. ఈ మనోహర సంధ్యాసమయాన అనంత ఆకాశంలో కూడా ఒకానొక మహర్షి చుట్టూ చిన్ని చిన్ని సుకుమార నక్షత్ర మండలి శిష్యబృందమువలె ప్రశాంత భావంతో హోమము చేయుటకు కూర్చున్నట్లుగా ఉంది.

హోమాగ్నిలో నేయి పడేసరికి అగ్ని శిఖలు పైకి లేచాయి. తపోవనం ప్రకాశవంతమైంది. దూరాన అడవిలోని బాటసారులు ఈ హోమాగ్నిని చూస్తూ వెళుతున్నారు. అలాంటి సమయాన ఒక బాలుడు భయంతో ఒదిగి ఒదిగి ఆశ్రమద్వారంలోనుంచి ఒక్కొక్క అడుగే ముందుకు వేస్తూ వస్తున్నాడు. సుకుమారమైన అతని చిన్ని దోసిలిలో అర్ఘ్యము ఉంది. దగ్గరకు వచ్చి ఆ బుడతడు ఫలపుష్పాదులను మహర్షి పాదముల ముందుంచాడు. అత్యంత భక్తి భయంతో మహర్షి పాదములకు నమస్కరించాడు.

క్రొత్తగా వచ్చిన ఈ బాల అతిధిని గౌతమ మహర్షి స్నేహదృష్టితో చూశారు. కోయిలకంటె మధుర స్వరంతో "గురుదేవా, నాపేరు సత్యకాముడు. నా నివాసము కురుక్షేత్రము బ్రహ్మవిద్య నేర్చుకునేందుకు నా తల్లి నన్ను మీ వద్దకు పంపినది" అని విన్నవించాడు బాలుడు.

చిరునగవుతో గౌతమ మహర్షి వాత్సల్యపూరిత స్వరంతో "సుశీలా, నీ కోర్కె సిద్ధించుగాక! వత్సా నీ గోత్ర మేది? బ్రాహ్మణ బాలునికి మాత్రమే బ్రహ్మవిద్య నేర్పబడు తుందని నీకు తెలియక పోవచ్చును" అని అన్నారు.

బాలుడు మెల్లగా "నా గోత్రము ఏమిటో నాకు తెలియదు మహర్షీ! మీ శలవైనచో వెంటనే వెళ్ళి మా తల్లి నడిగి తెలుసుకొని వచ్చెదను" అని చెప్పాడు.

ఈ మాట అని ఉత్సాహవంతుడగు ఆ బాలుడు మహర్షికి నమస్కరించి అప్పటికప్పుడే ఆ చీకట్లో అడవి మార్గాన బయలుదేరి వెళ్ళాడు. వన్యమృగముల భయంకరమగు అరుపులకుకూడా అతడెంత మాత్రం భయపడలేదు. ఆశ్రమంలో గౌతమ మహర్షి వద్ద చదువు నేర్చుకోవాలనే ఉత్సాహంలో అతడు నిర్భయంగా ముందుకు సాగిపోయాడు.

నదీతీరాన గ్రామం, గ్రామానికి ఒక కొసన బాలుని కుటీరం వుంది. బాలుడు త్వర త్వరగా అక్కడికి చేరుకున్నాడు, కుటీరం లోపల మినుకు మినుకు మంటూ దీపం వెలుగుతూ వుంది. అతని తల్లి జాబాలి ద్వారంలో నిలబడి కుమారుని రాకకై నిరీక్షిస్తూ ఉంది.

తల్లి అతనిని కౌగిట చేర్చుకొని "నాయనా, మహర్షి ఏమన్నారు?" అని అడిగింది.

"అమ్మా, నీ గోత్రం ఏమిటి అని మహర్షి అడిగారు. బ్రాహ్మణునకు మాత్రమే బ్రహ్మవిద్య నేర్పుతానని కూడా అన్నారు. మన గోత్రం ఏమిటమ్మా?" అని అన్నాడు సత్యకాముడు. బాలుడు మాటలు వినగానే జాబాలి సిగ్గుతో తల వంచుకొంది. ఆమె కోమల కంఠస్వరంతో "బిడ్డా, నేను దుఃఖ దారిద్రపు రోజుల్లో అనేకమందికి సేవచేసి నిన్ను పొందాను. నేను అనేకమంది దేవుళ్ళను మొక్కాను. దైవము నాయందు దయతలచి పతిహీనురాలగు జాబాలి కడుపున నిన్ను పుట్టించాడు. నీ గోత్రమేమిటో నాకు తెలియదు బాబూ" అని చెప్పింది.

  

ఆ రాత్రి గడిచిపోయింది. గౌతమ మహర్షి ఆశ్రమంలోని తరు శిఖరములపై ప్రాతఃకాలపు అరుణకాంతి ప్రసరించింది. ఆశ్రమంలోని పెంపుడు నెమళ్ళు మేతకోసం బయటకు వచ్చి తిరుగ సాగాయి. తరుణికాంతివలె ప్రకాశించు దీప్తివంతమగు ముఖములుగల శిష్యులు ప్రాతఃస్నాన మాచరించి మామిడి చెట్టుక్రింద గౌతమ మహర్షి చుట్టూ చేరి కూర్చున్నారు. ప్రాతఃస్నాన మాచరించిన శిష్యుల జడలనించి నీటి బిందువులు జారుతున్నాయి. తపోవనంలోని పుణ్యనిర్మల కాంతి యీ బాలకుల ముఖములందు ప్రకాశిస్తుంది. పురాతన వటవృక్షం మీది పక్షులు పాడుతున్నాయి. తుమ్మె

దలు రాగాలాపన చేస్తూ పుష్పములపై యెగురుతున్నాయి. సరస్వతీనదీ ప్రవాహం కమ్మనిపాటవలె సాగుతూవుంది. ఆశ్రమంలోని బాలురు యేకకంఠంతో సామవేద గాథల్ని పాడుతున్నారు ఆహా! ఆ దృశ్యము కడు మనోహరము! స్వర్గానుభూతి కలిగించుచున్నది. ఏకాంతమందు కూర్చొని ప్రకృతి ఏదో నాల్గు తాళముల వాయిద్యమును వాయిస్తున్నట్లుగా వుంది. తపోవనంలోని అనేకమంది విద్యార్థులు సృష్టివాయిద్యముతో గొంతు కలిపి పాడుతూ వున్న సమయాన సరస్వతీ నదీతీరం వెంబడి నడిచి వస్తున్న సత్యకాముడు తనలో తాను ఎంత విలపించుచున్నాడో గదా!

"అయ్యో, నాకు గోత్రము లేదు! తండ్రి లేడు! ప్రపంచంలో నేను ఒంటరివాడను కదా! ఆకాశంనుంచి రాలిపడి పోయిన నక్షత్రంవలె నేను ఏకాకిని! సత్యకాముడనుమాత్రమే అర్థహీనమగు ఒకశబ్దం! ఇక్కడ అనేకమంది బాలకులు వేద పాఠం చదువుతున్నారు. మహర్షి వారిని తమ ఒడిలో కూర్చోబెట్టుకుంటారు, ముద్దాడుతున్నారు. ఆ బాలకులలో చేరి చదువుకునే అదృష్టం నాకు లేదుకదా! నాకు గోత్రము లేకపోవుటయే ఇందుకు కారణము." అని సత్యకాముడు లోలోపల కడుసంతాప పడసాగెను.

* * *

నిట్టూర్పు విడుచుతూ అతడు ఆశ్రమంలోని ఒక పొదరింటి వరకు వచ్చి ఆగిపోయాడు. గౌతమ మహర్షి యొక్క వాత్స

ల్యపూర్ణత దృష్టి అతనిపై పడింది. అప్పుడు వారు "వత్సా, ఇటురా! నీ గోత్రమేమిటో చెప్పు" అని దగ్గరకు పిలిచి అడిగారు.

సత్యకాముడు వంచిన తలను పైకెత్తాడు. అతని శ్యామల విశాల నేత్రాలు అశ్రువులతో తడిసి వున్నాయి. వినమ్రుడై మహర్షికి నమస్కరించి "మహర్షీ! నా తల్లి నే నడిగిన దానికి ఏడ్చుచూ నాకెవరూ తండ్రి లేరని చెప్పింది. అమ్మ సమస్త దేవతలనూ పూజించిందట. ఆమెయందు కరుణించి దేవతలు నన్ను ఆమెకు ప్రసాదించారట. కనుక నా కే గోత్రమూ లేదని అమ్మ చెప్పింది" అని చెప్పాడు.

శిష్యులు పరిహాసముగా నవ్వసాగిరి. తేనెతుట్టెపై ఏదైనా గడ్డి పడినప్పుడు రయ్‌రయ్ మంటూ తేనెటీగలు రేగి నట్లు ఆ విద్యార్థి బృందములో కోలాహలం బయలుదేరింది. ఒక విద్యార్థి అతనిని వింతగా చూస్తే మరొక విద్యార్థి హేళనగా "అయ్యో! ఇతనికి తండ్రే లేడట" అంటే వేరొక విద్యార్థి "ఛీ! ఛీ! గోత్రమే లేదు" అంటే ఇంకొక విద్యార్థి "ఇదంతా తెలిసికూడా ఇక్కడికి ఏముఖం పెట్టుకొనివచ్చాడు? అయినా గురువుగారు ఇటువంటివానితో ఎందుకు మాట్లాడు తున్నారో?" అని నలుగురూ నాలుగు రకాలుగా అన సాగారు.

సత్యకామునికి దుఃఖం ఆగలేదు. అతనికి కళ్ళనుంచి ఏకధారగా కన్నీరు కారసాగింది. విద్యార్థుల ఎగతాళి మాటలు విని అతని మెదడులో "నాకు గోత్రం లేదుకదా!" అనునది సుళ్ళు తిరగసాగింది. గౌతమ మహర్షి విద్యార్థుల

మాటలు వింటున్నాడేకాని, వారి దృష్టి మాత్రం పితృహీనుడగు సత్యకామునిపైనే ఉంది.

"సత్యమును పలుకు ఈ బాలుడు ధన్యుడు!" అనే గౌతమ మహర్షి హృదయం చెపుతూ ఉంది.

* * *

గౌతమ మహర్షి తమ ఆసనం నుంచి లేచి నిలబడ్డారు. చేతులు చాచి ఏడుస్తున్న ఆ బాలుని కౌగిట చేర్చుకున్నారు. "కుమారా, నువ్వు గోత్ర హీనుడవు కాదు. పితృహీనుడవూ. అబ్రాహ్మణుడవూ! కాదు. వత్సా! నువ్వే నిజమైన బ్రాహ్మణుడవు. నీ గోత్రం పేరు 'సత్య గోత్రం'. బిడ్డా! ఈ మాట మాత్రం మర్చిపోవద్దు" అని చెప్పారు మహర్షి.

అదే సమయాన మాధవీ లతనుంచి నాలుగైదు పుష్పములు సత్యకాముని శిరముపై రాలాయి. తపోవనమంతా నిశ్చలముగా ఈ దృశ్యమును చూచుచుండెను. ఆశ్రమంలోని శిష్యబృందంలో మరొక బ్రహ్మచారి చేరాడు. భవిష్యత్తులో ఈ సత్యకాముడే గౌతమ మహర్షి ప్రియశిష్యుడయ్యాడు.



# సిద్ధించిన కోర్కె

ఒకనాడు గోస్వామి, తులసీదాసు సాయంత్ర సమయాన గంగానదీ తీరాన విహరించుచుండిరి. అప్పుడు వారి హృదయము ప్రభుభజనలో లీనమై ఉండెను. ఆ సమీపమందే స్మశానము కలదు. అకస్మాత్తుగా తులసీదాసుగారు స్మశానమువైపు చూశారు. అక్కడ ఒక స్త్రీ మరణించిన తన భర్త పాదముల చెంత కూర్చొని ఉండుట వారు గమనించారు. ఆమె భర్తతో సహగమనము చేయుటకు సంకల్పించుకొని ఉండెను. నుదుట తిలకము తీర్చియుండెను. పాపటలో కుంకుమ ధరించి, పెళ్ళినాటి దుస్తుల నలంకరించుకొని ఉండెను.

అక్కడ చేరిన బంధుమిత్రులు సంతోషమున కేకలు వేయసాగిరి. ఆ పతివ్రతకు జయము పలుకుచుండిరి. పురోహితులు ఆమెను అభినందించుచూ చితిని పేర్చసాగిరి. ఆ స్త్రీ అకస్మాత్తుగా అత్యంత వ్యాకులతతో తులసీదాసుగారితో "స్వామీజీ, పవిత్రమైన మీ అనుమతికూడా లభించినచో నేను సంతోషముగా వెళ్ళెదను" అని అడిగెను.

"అమ్మా, ఈ ఏర్పాట్లన్నీ ఎక్కడికి వెళ్ళటానికి?" అని అడిగారు తులసీదాసు.

"నా నాథునితో పాటు చితిలో దహనమై స్వర్గము నకు వెళతాను" అని చెప్పిందా స్త్రీ.

"అమ్మా, ఈ భూమిని వదలి స్వర్గానికి వెళ్ళాలనే కోర్కె నీ కెందుకు కలిగింది? స్వర్గము సృష్టించినవాడే ఈ భూమినికూడా సృష్టించాడు కదా!" అని చెప్పారు తులసీదాసు.

అమాయకురాలగు ఆ స్త్రీ తులసీదాసు చెప్పిన మాటలలోని రహస్యాన్ని గ్రహించలేకపోయింది. ఆమె విస్మయంతో వారిని చూస్తూ ఉండిపోయింది.

"ధర్మావతారుడైన తులసీదాసుగారు ఇవాళ ఇలా ఎందుకు చెపుతున్నారు?" అని ఆమె మనసులో తర్కించుకోసాగింది. తరువాత ఆమె ప్రత్యక్షముగా వారితో "నా నాథుడు నా కిక్కడే లభించేటట్లయితే నాకు స్వర్గంతో పనేమిటి స్వామీ?" అని అంది.

తులసీదాసుగారు చిరునవ్వు నవ్వి "అమ్మా, ఇంటికి వెళ్ళు. నీ నాథుడు నీకు ఒక మాసం రోజుల్లో లభిస్తాడని ఈ సాధు చెపుతున్నాడు – వెళ్ళు" అని అన్నారు.

తులసీదాసుగారు చెప్పిన మాటలయందు ఆ భక్తురాలికి శ్రద్ధ కలిగింది. ఆశాపూరిత హృదయంతో ఆ స్త్రీ తులసీదాసు వెంట బయలుదేరి వెళ్ళింది. పురోహితులు

ఆమెని శపించారు! బంధుమిత్రులు అనేక విధాల ఆమెను నిందించసాగారు. ఎన్నో తిట్టారు. కొందరు గడ్డలు వేసికొట్టారు. ఒక క్షణం క్రితము ఆమె మహా ప్రతివత - ఇప్పుడు వారి దృష్టిలో ఆమె కులట; భయకంపితురాలైన ఆ స్త్రీ తులసీదాసుగారి చాటున ఒదిగి నడుస్తూ, మధ్య మధ్య వెనుదిరిగి చూస్తూ వెళుతుంది. తులసీదాసుగారు రామ సంకీర్తనలో లీనమై నిర్భయంగా నడిచి వెళుతున్నారు. ఆ మహా భక్త వరేణ్యుని సమీపానికిగానీ, వారి వెంట ఉన్న ఆ స్త్రీ వద్దకు రావటానికిగానీ ఎవరూ సాహసించ లేదు.

* * *

నిర్జన ప్రదేశమందున్న ఒక పర్ణకుటీరములో ఆ స్త్రీని ఉంచి తులసీదాసుగారు తిరిగి గంగానదీ తీరానికి వచ్చారు. ఆ రాత్రంతా వారు రామ సంకీర్తనతో అక్కడే గడిపి వేశారు. ఉదయం మాత్రం వచ్చి కాసేపు ఆ స్త్రీ వద్ద కూర్చుని భగవంతుడు దయామయుడని చెప్పివెళుతూ ఉండే వాడు. ఒక నెలరోజులు ఈ విధంగానే జరిగింది. ఆ వితంతు స్త్రీ ముఖంలో ఒక విధమైన అమరోత్సాహం కన్పించింది. తెల్లని దుస్తులలో ఆమెలో పరమ సౌభాగ్య లక్షణం తొంగి చూసింది. ఆమె కళ్ళనుంచి ఇప్పుడు కన్నీరు రావటంలేదు. ఆమె కళ్ళలో ఏదో వింత వెలుగు కన్పించసాగింది.

బంధుమిత్రులు ఒకనాడు ఆమెవద్దకువచ్చి "నీ నాథుడు జీవించాడా?" అని నొక్కి-నొక్కి అడిగారు.

ఆ వితంతు స్త్రీ నవ్వి "అవును. నా నాథుడు తిరిగి వచ్చాడు" అని జవాబు చెప్పింది.

అందరు బంధుమిత్రులు త్రుళ్ళిపడి "ఏడి? ఎక్కడ ఉన్నాడు? ఏం చేస్తున్నాడో త్వరగా చెప్పు" అని అడిగారు.

"ఈ హృదయ కుటీరంలో నా నాథుడు సజీవంగా నిలిచి ఉన్నాడు. మీ రెవ్వరూ వారిని చూడలేరు గదా!" అని అందా స్త్రీ.



# హీరా - కుణి

గొల్ల పడుచు పేరు హీరా_ఆవుపేరు కుణి. హీరాకు ఒక నెల పసిబిడ్డఉంది. కుణి బిడ్డకూడా నెలరోజులది. హీరా రాయగడ పర్వతంమీద నివసించే మహారాష్ట్ర రాజుగారికి పాలుపోయటానికి వెళుతూఉండేది. కుణీ పాలుత్రాగి మహా రాజుగారు మహాదానందం పొందుతూ ఉన్నారు. కుణీ బిడ్డను గురించి హీరా ఏనాడూ ఆలోచించి ఎరుగదు. దానిపట్ల ఆమెకు లేశమైనా కనికారం లేదు. పాలుపితికే సమయాల్లో కుణీ ఆవు మధ్యమధ్య తన బిడ్డను పిలుస్తూ ఉండేది. దూడ పాలు త్రాగడానికి పరుగెత్తుకుంటూ వచ్చేది. హీరా దానిని దూరంగా నెట్టివేసేది: దూరంగా ఏ గుంజకో కట్టివేసింది. ఈ విధంగా దూడ తన తల్లిదరికిరాలేక, పాలకోసం పరితపిస్తూ ఉండేది.

హీరా ఇవేమీ ఆలోచించే కాదు. ఆమె ప్రతిరోజు ఉదయం, సాయంత్రం పాలుపితికి మహారాజుగారికోటలో అమ్మివచ్చేది. సాయంత్రం చీకటి పడకముందే హీరా కోట నుంచి ఇంటికి తిరిగివచ్చేది. వచ్చీరాగానే తనబిడ్డకుపాలిచ్చి, చిచ్చికొట్టి నిద్రబుచ్చేది. ఆ తరువాత హీరా దూడను కుణీ వద్ద వదిలేది. దూడ చెంగు చెంగున గెంతుతూ తల్లి ఒడిలో దూరేది. కానీ కుణీవద్ద తనబిడ్డకు చాలినన్ని పాలు ఉండేవి కావు.

# హీరా - కుణి

గొల్ల పడుచు పేరు హీరా_ఆవుపేరు కుణి. హీరాకు ఒక నెల పసిబిడ్డఉంది. కుణి బిడ్డకూడా నెలరోజులది. హీరా రాయగడ పర్వతంమీాద నివసించే మహారాష్ట్ర రాజుగారికి పాలుపోయటానికి వెళుతూఉండేది. కుణీ పాలుత్రాగి మహా రాజుగారు మహదానందం పొందుతూ ఉన్నారు. కుణీ బిడ్డను గురించి హీరా ఏనాడూ ఆలోచించి ఎరుగదు. దానిపట్ల ఆమెకు లేశమైనా కనికారం లేదు. పాలుపితికే సమయాల్లో కుణీ ఆవు మధ్యమధ్య తన బిడ్డను పిలుస్తూ ఉండేది. దూడ పాలు త్రాగడానికి పరుగెత్తుకుంటూ వచ్చేది. హీరా దానిని దూరంగా నెట్టివేసేది: దూరంగా ఏ గుంజకో కట్టివేసింది. ఈ విధంగా దూడ తన తల్లిదరికిరాలేక, పాలకోసం పరితపిస్తూ ఉండేది.

హీరా ఇవేమీా ఆలోచించే కాదు. ఆమె ప్రతిరోజు ఉదయం, సాయంత్రం పాలుపితికి మహారాజు గారికోటలో అమ్మివచ్చేది. సాయంత్రం చీకటి పడకముందే హీరా కోట నుంచి ఇంటికి తిరిగివచ్చేది. వచ్చీరాగానే తనబిడ్డకుపాలిచ్చి, చిచ్చికొట్టి నిద్రబుచ్చేది. ఆ తరువాత హీరా దూడను కుణీ వద్ద వదిలేది. దూడ చెంగు చెంగున గెంతుతూ తల్లి ఒడిలో దూరేది. కానీ కుణీవద్ద తనబిడ్డకు చాలినన్ని పాలు ఉండేవి కావు.

గనుక రెక్కలువస్తే యెంత బాగుండును! క్షణంలో నా బిడ్డను చేరుకోగలను గదా! బిడ్డ పాలకోసం యెంత ఏడుస్తున్నాడో?" అని ఆలోచించసాగింది.

పర్వతం క్రింద లోయలో హీరా నివసించే పల్లె ఉంది. కణీ ఆవు గొంతెత్తి తలబిడ్డను పిలుస్తూఉంది. కణీ ఆవు అరుపు కోటలోఉన్న హీరా పాలదుత్తను నేలగొట్టి చర్రున లేచి నిలబడింది. ఆమె జంకూ గొంకూ లేకుండా బయటకు వెళ్ళటానికి మరేదైనా మార్గం కనిపిస్తుందేమో అని చూడసాగింది.

రాయగఢపు కోటగోడలు అతి పురాతనములు. ఒక చోట పర్వతము గోడతో కలిసిఉంది. ఆ చోటనే ఒక రావి చెట్టు పర్వతంమీదనుంచి కోటగోడమీదికి జరిగిఉంది. అర్ధ రాత్రి సమయానికి వెన్నెల వచ్చింది. వెన్నెలలో హీరాకు ఈ మార్గం కన్పించింది. పర్వతపు మొనదేలిన బండలు మొసలి కోరలవలె వెన్నెలలో మెరుస్తున్నాయి. హీరా ఆ మార్గంగుండా ఒక్కొక్క రాతిమీద జాగ్రత్తగా కాలూనుతూ దిగి క్రిందికి చేరుకుంది. తరువాత ఒక కాలిబాట వెంట తన ఇంటికి చేరింది.

అప్పటికి రాత్రి మూడోజాము గడుస్తూవుంది. తెల్లవారబోతూవుంది. బిడ్డ వేడ్చి వేడ్చి నిద్దరోయింది. హీరా నిద్రపోతున్న బిడ్డను గట్టిగా హృదయానికి హత్తుకొని పాలివ్వసాగింది. అటు అవుదూడకూడా కట్టుతెంచుకొని తల్లివద్ద పాలుత్రాగుతూ ఉంది. హీరా ఆనాడు మాత్రం దూడను

దూరంగా తరిమివేయలేదు — దానిని తల్లివద్దనే వదలి వేసింది.

*    *    *

తెల్లవారింది. ప్రొద్దెక్కింది. మహారాజుగారునిద్రనుంచి మేల్కొని పాలకోసం చూశారు. ఇవాళ హీరా పాలు తెచ్చి ఇవ్వలేదు. పాలకోసం హీరా ఇంటికి సైనికులు హుటా హుటిగా బయలుదేరి వచ్చారు.

"పాలు లేవు" అని జవాబుచెప్పింది హీరా. వచ్చినది రాజభటులు! అలాంటి జవాబుతో ఎలా తిరిగివెళతారు? హీరాను బంధించి కోటకు లాక్కుపోయారు. మహా రాజుగారు హీరా చెప్పిన కథనం అసాంతం విన్నారు. వారి హృదయం ద్రవించింది. మహారాజుగారు హీరాకు ఒక గ్రామాన్ని జాగీరుగా ఇచ్చారు. ఆమె ఆ రాత్రి బయటకు వెళ్ళిన మార్గానికి 'హీరాకుణీ' అని నామకరణం చేశారు.

హీరా పాలు అమ్మటం మానివేసి వ్యవసాయం చేసుకోసాగింది.

# పరశువేది

బృందావనంలో యమునానదీతీరాన సనాతన మహర్షి జపము చేసుకొంటున్నాడు. ఇంతలో ఒక పేదబ్రాహ్మణుడు అక్కడికివచ్చి మహర్షికి నమస్కరించాడు.

"నాయనా, ఎక్కడినుంచి నీ రాక? నీ పేరేమిటి" అని ప్రశ్నించాడు సనాతన మహర్షి.

"మహర్షీ, నేను చాలా దూరదేశంనుంచి వచ్చాను. నేను పడుతున్న బాధలు ఇంతింతని వర్ణించి చెప్పనలవికాదు. ఆ పరమేశ్వరుణ్నే నమ్ముకుని అతనినే ధ్యానించుకుంటూ ఉండగా ఒకనాటి అర్ధరాత్రి సమయాన కలగన్న చందాన "యమునానదీ తీరాన ఉన్న సనాతన మహర్షిని యాచించు. ఆ మహర్షివల్ల నీ కష్టాలు తొలగిపోతాయి" అని ఏదో దైవ వాణి విన్పించింది.

"నాయనా, నన్ను నమ్ముకొని ఎంతో ఆశతో నువ్వింతదూరం వచ్చావు. కానీ, నా వల్ల ఏమికాగలదు? నేను సర్వమూ త్యజించి వచ్చాను. ఈ జోలె తప్ప నావద్ద మరేమీ లేదు. కానీ, ఒక సంగతి. ఇప్పుడే లీలగా గుర్తొచ్చింది. ఒకానొకప్పుడు ఎవరికైనా ఇవ్వటానికి ఉపయోగిస్తుందనే ఉద్దేశ్యంలో ఒకచోట ఒక మణిని ఇసుకలో దాచే ఉంచాను. వెళ్లునాయనా, వెళ్ళి దానిని తెచ్చుకో; నీ

దుఃఖాలన్నీ తీరిపోతాయి నీకు తరగని సంపద దొరకు తుంది, వెళ్లు" అని చెప్పాడు సనాతన మహర్షి.

ఆ మణి పరుసు వేది! ఆహా. ఎంతటిఅదృష్టం! బ్రాహ్మ ణుడు పరుగున మహర్షి చెప్పినతావుకు వెళ్ళి భూమిలో పాతిఉంచిన మణిని త్రవ్వి తీసుకున్నాడు. మణిని ఇనుప లావెత్తుకు తాకించేసరికి అది బంగారపు దయింది. బ్రాహ్మ ణుడు ఆనందపరవశుడై గంతులు వేయసాగాడు. ఆనందంతో అలా ఎంతసేపు మైమరచిపోయాడో చెప్పలేము. మన స్సులో అతడనేక మేడలు కట్టుకున్నాడు. ఎన్నో కలలు గనసాగాడు. తాను అనుభవించబోయే భోగవిలాసాలను గురించి అనేక రకరకాలుగా వూహించుకోసాగాడు. చివరకు అలసిపోయి యమునానదీ తీరాన కూర్చొని విశ్రమించ సాగాడు. ప్రవహించే యమునానదీ గలగల ప్రవాహపు మధురధ్వనికి శాంతచిత్తుడై కూర్చొని ఆ బ్రాహ్మణుడు పక్షుల మధుర కలరవాన్ని వినసాగాడు. సూర్యాస్తమయం కాబోతుంది. ఆ దృశ్యం మరింత మనోహరంగా ఉంది.

బ్రాహ్మణుడు ఒక కంటితో ఈ అద్భుతసౌందర్యాన్ని చూస్తున్నాడు; వేరొక కంటితో తన మనసులోని ఊహా సౌధాలను చూస్తున్నాడు. అతనిమనస్సు సందిగ్ధంతో వూగిస లాడసాగింది. అతనికి సనాతన మహర్షి గుర్తొచ్చాడు. అత నికి అనేక విషయాలు గుర్తొచ్చాయి.

బ్రాహ్మణుడు వెంటనే లేచి సనాతన మహర్షి ఉన్న చోటుకు చేరుకున్నాడు. అతడు మహర్షి పాదాలపై వాలిపోయాడు. దుఃఖాతి రేకమున తడబడుతూ "అక్షయ సంపదల నిచ్చే పరశువేదిని తృణప్రాయముగా భావించి ఇచ్చివేయగలిగిన ఆ మహాత్ముని పాదధూళి కన్న నేను కోరేదేమీ లేదు" అంటూ బ్రాహ్మణుడు మణిని నదిలోకి విసరివేశాడు. మణిని ఇచ్చినవారు. దానిని స్వీకరించినవారూ ఇద్దరూ జయించారు.

